ఓం

# ముక్తీశ్వర శతకము.

ముదిగొండ బసవయ్య శాస్త్రి చేతను
కొండపల్లి లక్ష్మణపెరుమాళ్ళరావు చేతను
రచియింపఁబడి

గరికే సత్యనారాయణచే
ప్రచురింపఁబడియె.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు
బి. కే. స్వామిచే
ముద్రింపఁబడియె.



శ్రీ

శ్రీసద్గురుభ్యోనమః

ఓం

# ముక్తీశ్వరశతకము.



మత్స్యాద్యగణ్యస్వరూప విబుధశ్రేణీనుతప్రాభవా
కామక్రోధమదాద్యరిప్రకరసంహారాదరా సద్రమా
భూమానందమరందసంభరితహృత్స్వాంతాబ్జ లోకేశ్వర
శ్రీముక్త్యాఖ్యపురాగ్ర్యవాస హర గౌరీనాథ ముక్తీశ్వరా.

శా. నీ సేవల్ స్తుతులున్ నతుల్ గృతులు నిష్ఠాదిప్రభావంబులున్ జే
రాసన్ వ్రాసచేయఁ బూనుటకు నామ్నాయంబులే క్రిందుమీఁ
దై సాధింపఁగ లేక యుండ నిఁక మాకా చెప్పఁ బూనన్ గనా
భాసంబౌటకె కాక నేమయిన సంభావించె ముక్తీశ్వరా. 2

మ. కవితామాధురి మెచ్చి భూధవులు సత్కారంబులన్ జేయఁగాఁ
దవనిన్ బండితులీరసజ్ఞతకు సంస్తవ్యయంచు శ్లాఘించి గౌ
రవమున్ గూర్పఁగఁ గాదె కేవల ముఖప్రత్యాశనార్థంబు నీ
స్తవమున్ బద్యశతంబుగా సలుప నిచ్ఛల్ పుట్టె ముక్తీశ్వరా. 3

మ. సరసం బంచు విలాస మంచు మొదలే • చాతుర్య మేపార న
క్రూరకర్మాలినబూతుబద్యములఁ జక్కఁగా బెట్టి పాత్రంబుగా
దొరలుం దాతలమెప్పుకోలునకు నెంతో నోరు పాడ్సేయుకం
కొ రసంబో విరసంబొ చెప్పితిమి నిన్నే నమ్మి ముక్తీశ్వరా. 4

మ. రస మెట్లున్నను లక్షణంబునను శాస్త్రంబందొ భావోక్తినో
దోసఁగుల్ చాలఁ బొసంగవచ్చు నయినన్ • దోషఘ్న మౌనీస్తవ
ప్రసృతిన్ దాఁ బరుసంబునన్ గలసి స్వర్ణం బైనలోహస్థితిన్
బస గాంచన్ గల దీకృతీంద్రము శుచిత్వం బంది ముక్తీశ్వరా. 5

శా. అంతో యింతయొ గానమో కవనమో • యభ్యాసమై సజ్జన
స్వాంతంబుల్ చిగురింప నీస్తుతి రసాస్వాదంబుగాఁ గూర్చి ని
శ్చింతన్ గాత్రము జంత్రముం గలిపి దృష్టిన్నిపదాబ్జంబులన్
గంతుల్ వేయఁగఁ బాటఁ బాడ నిఁక జన్మం బున్న ముక్తీశ్వరా.

శా. ఓ కల్యాణగుణాకరా పురహరా • యో భక్తసంరక్షకా
యో కారుణ్యమయస్వరూప వరదా • యో దైత్యవిధ్వంసక
యో కంజాప్తశశాంకవహ్నినయనా • యో మోక్షసంధాయకా
యో కైలాసనివాస దోషహరణా • యో దేవ ముక్తీశ్వరా. 7

శా. దైవోత్తంసుఁడ వంచు భక్తజనసంత్రాణుండ వంచున్ గృపా
భావంబున్ వెలిఁ బుచ్చువాఁడ వనుచున్ • బల్మారు నీభక్తులున్
గైవారంబులు సేయుచుంటఁ గని నిక్కంబంచు ధైర్యంబునన్
దేవా నిన్నెద నమ్మి నిత్యమును భక్తిన్ గొల్తు ముక్తీశ్వరా. 8

మ. జగమన్ పద్మము పుట్టె నీహృదయకాసారంబునన్ దాన నా
నిగమంబుల్ నిగమాంతముల్ విరిసి తేనెల్ వాఱ భృంగాళినాఁ
దగు నీభక్తగణంబు తన్మధువు నాస్థన్ గ్రోలి నీనామ మిం
పుగ గానం బొనరించుచుండెఁ గలదే • పుణ్యంబు ముక్తీశ్వరా. 9

మ. ప్రకృతిప్రాభవహేతుభూత మగుడ♦వ్యచ్ఛక్తి నర్ధాంగమం
దకలంకప్రతిభన్ ధరించి తగ ని♦ర్వ్యాజానుకంపామతిన్
సకలస్థావరజంగమాత్మకజగ♦త్సంత్రాణపారీణతా
ప్రకటప్రక్రియ విస్తరించితివి నిన్ ♦ భావింతు ముక్తీశ్వరా. 10

శా. లోకాధీశుఁడవై సమస్తమునిసు♦శ్లోకుండవై యుండునీ
వే కించిత్ జ్ఞునిబోలె భిక్షుకుఁడ వై♦తే నీకు దాసుండ నా
నా కీసంపద లేల తుచ్ఛసుఖసం♦ధానంబు లేలా భవ
చ్ఛ్లోకజ్ఞానము సద్విరాగమును జా♦లుం జుమ్ము ముక్తీశ్వరా. 11

శా. రాకల్ లంచ మొసంగ లే నతిదరి♦ద్రుండ న్నినుం గాంచువి
ద్యాకౌశల్యము లేను లేదు తనుదా♦ర్ఢ్యం బైనఁ బుణ్యస్థలుల్
నాకుం బోవఁగ నింక నే మనుచు ని♦న్నాశ్రింతు మోక్షంబు ని
త్యాకారా యిఁక నీ వెఱుంగని ప్రమే♦యం బెద్ది ముక్తీశ్వరా. 12

మ. జననం బందినదాది దుష్కృతము ల♦శ్రాంతంబుఁ గావించుచున్
దినముల్ పుచ్చుచునుంటి నింతదనుకన్ ♦ దేవా భవద్దివ్యమూ
ర్తిని నే నెవ్విధిఁ గాంచ నేర్తు నధికా♦ర్తిన్ గుందఁగాఁ జాల నిం
క ననున్ బ్రోవఁగ రమ్ము భక్తజనర♦క్షాదక్ష ముక్తీశ్వరా. 13

శా. ఇందే యుంటివొ యెందు నుంటి వొకో నా♦కీ వెందుఁ గాన్పింప వీ
యాందోళంబున మ్రందె డెందము మహా♦త్మా! సత్కృపన్ బూనియ
స్పందజ్ఞానము నా కొసంగు మిఁక నే♦సందేహమున్ లేక యా
నందంబున్ గొని నీదుసన్నిధిని జెం♦దన్ వత్తు ముక్తీశ్వరా. 14

మ. పరలోకైకసుఖంబు నొందుటకునై ♦ వాంఛించితిన్ గాని త
త్పరతన్ గర్మచయాతిబద్ధుఁడను నేఁ ♦ బంచాగ్నిమధ్యంబునన్
జిరకాలంబుఁ దపంబుఁ జేయఁ గలనా ♦ చిద్రూప సర్వేశ నీ
చరణాబ్జంబుల నమ్మియుంటి నిఁక మో♦క్షం బిమ్ము ముక్తీశ్వరా.15

శా॥ సర్వారిష్టము సర్వకిల్బిషవిలా♦సస్థాన మాద్యంతసు
ప్పర్వాభీలము దుఃఖమూలము మహా♦త్మాతానుభూతంబు దు
ర్గర్వోత్కంఠము దేహయాత్రను బొన♦ర్పం జాల నొక్కింతయున్
నిర్వాణంబును నా కొసంగుము దయన్ ♦ సేవింతు ముక్తీశ్వరా॥

మ. నిను నిందింపుచు నీకథల్ వినక నీ♦ నేతృత్వదాతృత్వముల్
మనసుం దెంచక నీదుభక్తులను బో♦లం జూచి కే దూఱుచుం
డినదుష్కర్మధురంధరుండు నరకా♦గ్నిం దగ్ధుఁడై పోవు నీ
వన సామాన్యుఁడవా నిజాంఘ్రిగతభ♦క్తాసక్త ముక్తీశ్వరా. 17

శా॥ ఎన్నో జన్మము లెత్తియుంటి నిఁక ముం♦ దె న్నెన్ని జన్మంబు లీ
తెన్నుం బొందఁగ నుంటినో యెఱుఁగ నో♦దేవా యిఁకన్ జాలు నీ
బన్నంబుల్ బడఁ జాల నన్నుఁ గృపతోఁ♦ బాలింపు మో తండ్రి నీ
కన్నన్ వే రొకదిక్కు లే రెవరు లో♦కారాధ్య ముక్తీశ్వరా॥ 18

శా॥ యుక్తాయుక్తవివేచనానుభవసం♦యుక్తోత్తమజ్ఞాను లా
ముక్తిన్ గోరి భవద్వినిర్మలపదాం♦భోజాతపూజాలస
ద్భక్తిన్ దన్మయులై సదా నిను మదిన్ ♦ ధ్యానింతురో యట్టిస
ద్వ్యక్తిన్ నాకు నొసంగుమయ్య నిను నేఁ♦ బ్రార్థింతు ముక్తీశ్వరా॥

మ. భవదీయం బగుపాదపద్మముల శుం♦భద్భక్తి ధ్యానించు ని
త్యవివేకస్ఫురణంబుఁ గాంచఁ గలభా♦గ్యం బెట్లు చేకూరు ప్రా
గ్భవమం దేనికృతిం బొనర్చితినొ యు♦క్తజ్ఞానసంపూర్ణమై
భవము న్నాకు నొసంగుమయ్య నిను నేఁ♦ బ్రార్థింతు ముక్తీశ్వరా॥

మ॥ జలధిం ద్రచ్చఁగ శక్తి లేదు విసమున్ ♦ సాధించి యర్పింప దు
ర్బలుఁడన్ జేలము గాఁగ నీకుఁ బులిచ♦ర్మం బెట్లు తే నేర్తు భూ
షల నైఁ బెట్టెద మన్నఁ గాని ఫణివా♦సం బెట్లు పో నౌను బూ
జల నిం కేవిధి సేతు వందన మిదే ♦ సైరింపు ముక్తీశ్వరా॥ 21

శా॥ ఆపాతాళవియత్ప్రవృద్ధభవదీయాకార మాద్యంతరీ
క్షోపాయైకరతిన్ హరిద్రుహిణు లత్యుత్సాహసంరంభముల్
దీపింపన్ గిటిహంసరూపములఁ బృథ్వీవ్యోమముల్ వచ్చి చూ
పోవన్ జాలక యుండ నేఁ గనుట యెట్లో తెల్పు ముక్తీశ్వరా॥

మ॥ తలఁపుల్ మీఱి క్షణక్షణంబునకుఁ జిత్తం బొక్కటీరై ననుం
గలుషాత్రిన్ బడఁద్రోసి నిత్యసుఖసంధానంబునుం జేయుని
శ్చల మానీపదభక్తి పోనడచె నాశాపాశముల్ త్రెంచి ని
ర్మలభక్తిం బురికొల్పి ప్రోవఁ గదె ప్రేమన్ నన్ను ముక్తీశ్వరా

మ॥ భర మైనట్టి స్వకుక్షిపోషణకు నేవం బైనకార్యంబు లే
త్తెఱఁ గావించి శరీరయాత్ర నొకమాడ్కిన్ సల్పుచున్ దానినే
స్థిర మంచెంచి భవత్సహాయమును బ్రార్థింపంగ లేనైతి నీ
శ్వర నామాశ్రయముఁ బాపినన్నికను బ్రోవన్ రావె ముక్తీశ్వరా॥

శా॥ అజ్ఞానాంధతమోవిశేషమున మాయాలీలలం జిక్కి నీ
యాజ్ఞల్ మీఱి మృషాసుఖంబులకు లోనై గర్వముం జెంది బ్ర
హ్మజ్ఞుల్ లేరని నిశ్చయించితి మహోన్మత్తుండనై యింక నన్
దక్షుం జేసి క్షమించి ప్రోవఁ గదవే నాతండ్రి ముక్తీశ్వరా॥ 25

శా॥ అయ్యా యమ్మ యటంచు నిన్నుఁ బలుమాఱర్థించి వేసారితిన్
గుయ్యాలింప విదేల యయ్య భువి దిక్కున్ మొక్కునన్ లేనినే
నయ్యా నీకుఁ బరీక్షసేయ నిది యేమన్యాయమో యయ్య రా
వయ్యా మ్రొక్కెద నయ్య ప్రోవఁ గద మయ్యా నన్ను ముక్తీశ్వరా.

మ॥ కరమందున్ గనకాచలంబు రజతగ్రావంబు పీఠంబు కి
న్నరనాథుండు సఖుండు కల్పతరుచింతారత్నగోశ్రేష్ఠముల్
స్థిరమై యుంట వసింప నే మొసఁగి తృప్తిన్ జేతు భక్తాపహా
ద్వరచిత్తాబ్జ! యొసంగెదన్ గొనుము మత్స్వాంతంబు ముక్తీశ్వరా

మ॥ ఘనమోహాటవిఁ జిక్కి చిత్తము వనౌకంబట్లు కాంతాజన
స్తనశైలంబులఁ జిమ్ములాడుచు దురాశాశాఖలం దూఁగుచుం
డెను జేఁ జిక్కక నాకు భక్తియను త్రాటిం గట్టి యాజ్ఞానువ
ర్తినిగాఁ జేకొను మయ్య మ్రొక్కెదను గౌరీనాథ ముక్తీశ్వరా॥

మ॥ తరమే నిన్ను నుతింప భక్తవరదా దైత్యేంద్రుఁ డొక్కండు దు
ర్భర మాఘోరతపం బొనర్చి తనద్వారంబునఁ గాపుంటకున్
వరమున్ వేఁడఁగ బంటవై వెడలి తద్ద్వారంబు కాపుండి తీ
వరియున్ భక్తులపట్టుఁగొమ్మ వని నేఁ బ్రార్థింతు ముక్తీశ్వరా॥

మ॥ లలిశాల్యాన్నసుగంధమాల్యవసనాలంకారసంపత్ప్రభా
కలనన్ భక్తులనెల్లఁ దన్పి విసమే గ్రాసంబు పెన్ బూది సై
నలఁదన్ గంధము భూషణాళి ఫణముల్ వ్యాఘ్రాజినం బంశుకం
బలరన్ గట్టి చరించు నిన్నెఱుఁగ శక్యం బౌనె ముక్తీశ్వరా॥ 30

మ॥ కలనైనన్ జవరాండ్రఁ గూడఁ బొలయుల్కల్ దీర్పఁగా నైన న
ప్పులకైనన్ దనప్రాణమానధనముల్ పోవంతకష్టంబులే
తలపైఁ గూలఁగనీ యసత్య మణుమాత్రంబైన రానీకఁ దా
నిల సత్యంబు వచించునో యతఁడె నీకిష్టుండు ముక్తీశ్వరా॥ 31

మ॥ తనప్రాణంబున నెంతతీపి కలదో తథ్యంబుగా నట్టిప్రే
మనె జీవంబుల నన్నిటిన్ గనుచు సంభావించి దుఃఖింపఁ దా
నును దుఃఖింపుచు నవ్వ నవ్వును దానున్ నవ్వుచున్ శక్తి యుం
డినమాత్రంబున సేవఁ జేయు నతఁడే నిన్ జూచు ముక్తీశ్వరా॥ 32

మ॥ ఒకకొన్నాళ్ళను గ్రిందుమీఁ దెఱుఁగకే నూరెల్ల నావాడగా
రక మావేషములన్ ధరించి తనుదార్ఢ్యం బంతయున్ గ్రుంగ ని
న్నికవాటంబులో తీసి చూచి యటుపైనిన్ గంగలోఁ గ్రుంకినన్
సుకృతుం డౌనె యనాత్మశుద్ధి యెపుడున్ శోధింప ముక్తీశ్వరా॥

మ॥ పుడమిన్ గొందఱు పొట్టకూటికయి యోవో వెఱ్ఱివేదాంతముల్
బడబళ్ళాడ నుపన్యసింపుచు వచఃప్రాగల్భ్యతన్ దైవమున్
బొడఁగాన్పింపఁగఁ జేతు మంచు జనులన్ మోసంబునన్ ముంతురా
వెడఁగుల్ చూచిరె నీదురూపమును నేవేళైన ముక్తీశ్వరా॥ 34

మ॥ అడియాసన్ బడి పొట్టకూటి కెడాపిద్యాప్రాభవం బంది యె
వ్వఁడో తచ్చిత్రవిచిత్రముల్ సలుప నాహా యంచు శ్లాఘింతు రీ
పుడమిన్ మానవు లట్టిమూఢులొ సతంబున్ నీమహాత్మ్యస్రష్టి నే
ర్పడని స్సాంద్రవిచిత్రమై శిరులఁ దల్పం బోరు ముక్తీశ్వరా॥ 35

మ॥ అరిషడ్వర్గగజంబు లుద్ధతి మదీయంబైనహృద్వాటిజా
కరముం జేరుచు సద్గుణాబ్జములఁ బోకార్పం దొడంగెన్ బరా
త్పర! వాసిం దనుమాడు మయ్య గజదైత్యధ్వంసి నీ వంచు న
క్కఱతోఁ వింటిని దిక్కు నీవ కద లోకారాధ్య ముక్తీశ్వరా॥ 36

మ॥ వరగాంభీర్య మగడ్తయై ధృతియె వప్రప్రాతమై సద్గుణో
త్కరముల్ సైన్యములై నిజేంద్రియములే ద్వారంబులై తావక
స్మరణజ్ఞానమె ద్రవ్యమై యలరునస్మత్స్వాంతదుర్గంబునన్
గరుణం గాపురముండు మెప్పుడును దుర్గాసక్త ముక్తీశ్వరా॥ 37

మ॥ తనకున్ గ్రోధము మంత్రి లోభము ధనాధ్యక్షుండు మోహంబు తం
త్రనియంతృండు మదంబు న్యాయపతి మాత్సర్యంబు సేనానిగాఁ
దనరన్ గాముఁడు విభుండు రాజ్యముగ మత్స్వాంతంబుఁ బాలింపుచుం
డెను గామారివి వాని గెల్చికొను తండ్రీ నీవు ముక్తీశ్వరా॥ 38

మ॥ అరయన్ సత్త్వరజస్తమంబు లవి ప్రోళ్లై మూఁడుఁ బెంపొంది దు
స్తరపాపౌఘనిశాచరావృతములై సన్మార్గరోధంబుగా
స్థిరతం గాంచెను నాహృదంతరమునన్ శీఘ్రంబ మాయింపుమా
పురసంహార మొనర్చి నాఁడ వఁట యేపుం జూపి ముక్తీశ్వరా॥ 39

మ॥ నరుఁడై పుట్టినదానికిన్ ఫలము సుజ్ఞానామృతాస్వాదనా
పరవశ్యుఁడగు సత్కథానుచరుఁడై వైరాగ్యసంప్రాప్తసౌ
ఖ్యరతుండై భవదీయభక్తుఁడయి పేర్కన్ ముక్తికాంతామనో
హరుఁడౌట కద తత్ఫలంబు దయసేయన్ రాదె ముక్తీశ్వరా॥

మ॥ చిరకాలంబున నావిశుద్ధహృదయక్షేత్రంబునన్ బుట్టియున్
దురితారణ్యము బాగుగాఁ బెరిగి యెంతో భీకరం బయ్యె సు
స్థిర మయ్యెన్ బరమేశ దాని నిఁక భస్మీభూతమున్ జేయుమా
కరుణన్ నీ దగుఫాలనేత్రదవమున్ గల్పించి ముక్తీశ్వరా॥ 41

మ॥ అణువైనన్ బరమాణువైన భవదీయాకారరేఖావిచా
రణపాత్రం బగు నిన్నుఁ జూడఁ గలమార్గం బెద్ది యో చూపి కా
రణభూతాత్ముఁడవైన నీదరిని జేరం గల్గుదీక్షావిచ
క్షణమున్ నాకు నొసంగుమయ్య నిను నిచ్చల్ గొల్తు ముక్తీశ్వరా

మ॥ భవదీయం బగువిశ్వరూపమును సంభావించుహృత్కంజమున్
భవదీయం బగునామసంస్మరణ మొప్పం జేయువాక్చాతురిన్
భవదీయం బగుసన్నిధానమున సేవల్ చేయుసద్భాగ్యమై
భవమున్ నాకు నొసంగుమయ్య నిను నేఁ బ్రార్థింతు ముక్తీశ్వరా॥

శా॥ పానీయంబులు గ్రోలుచో మెసవుచో వ్యాపారముం జేయుచో
నానాభోగము లందుచోఁ దలఁచుచో నైపుణ్యమున్ గాంచుచో
జ్ఞానానందము నందుచో సకలసంస్కారంబులం బొందుచో
నీనామస్మరణంబు సేతు నిఁకఁ దండ్రీ ప్రోవు ముక్తీశ్వరా. 44

మ॥ కలవో లేనివో కొన్నికొండెములు సాక్షాత్కార మానట్టులన్
బలుకుల్ దేనియ లొల్కు భూభుజుకడన్ బల్ మెప్పుగాఁ జెప్పి లో
కులకొంపల్ దెగముంచి నైజనకుదత్తుల్ లే రటంచున్ మహా
బలగర్వంబున విఱ్ఱవీఁగి నినుఁ దల్పన్ లేను ముక్తీశ్వరా॥ 45

మ॥ దయతోఁ గోర మ్మని చేరఁ బిల్వ దలఁకున్ దా డెక్కిన ట్లెక్కి ని
ర్భయతన్ సర్వము తానె కాఁ దలఁచి గర్వప్రాభవప్రాపేతదు
ర్ణయవృత్తిన్ విభు మోసగించి బహుళార్థగ్రాహియై నక్కరీ
తియె కాంక్షించెడుద్రోహి ఘోరనరకార్తిన్ గుందు ముక్తీశ్వరా॥

మ॥ పరసౌఖ్యంబున కోర్వలేక దురితస్వాంతంబునన్ బద్ధమ
త్సరమున్ బూని కుయుక్తులన్ సలిపి మిత్రద్రోహముం జేసి యె
ల్లరకున్ గంటకుఁడై ధనార్జనకుఁ గాలంబున్ వృథాపుచ్చుభూ
సురుతామాత్రము పుణ్య మిచ్చునె ముముక్షుల్ మెచ్చ ముక్తీశ్వరా॥

మ॥ స్వపసియుం బగువిద్య నేర్చి సుకవీంద్రస్తుత్యుఁడై సర్వశా
స్త్రవిరాజద్ధిషణాపరుం డయి జగచ్చక్రంబు లల్లాడఁ జే
సి విధిం డీకొని సృష్టి కెల్ల ప్రతిసృష్టిం జేయులోకైకవి
రవరుండున్ నినుఁ గొల్వకున్నఁ గను దౌర్గత్యంబు ముక్తీశ్వరా॥

మ॥ పరమార్థం బన నెట్టిదో యెఱుఁగి సంపద్యోగసంరంభదు
స్తరగర్వంబున దీనపోషణపరత్వం బన్న నే నెల్లకే
పరులన్ గాసిలఁ బెట్టి హింసలను జెప్పన్ రాని వేఁ జేసితిన్
దురితం బిప్డు ఫలించెఁ బ్రోవు మికఁ గొల్తున్ నిన్ను ముక్తీశ్వరా॥

మ॥ ఒకరాజన్యననుగ్రహంబునకె యెన్నో కష్టముల్ పొంది మా
యకు లామంత్రులయడ్డపుల్లలకు లోనై తత్ఫలంబుం బడఁ జా
లక యున్నప్పుడు నీకుమాయ ఘనజాలంబై తగుల్కొన్న లో
గక నిదివ్యపదంబుఁ జేరుటకు శక్యం బౌనె ముక్తీశ్వరా॥ 50

మ॥ జననీగర్భములోన నున్నతఱి నేచందంబునన్ నిన్ను నే
మ్మనమం దెంచితినో యెఱుంగ నిఁక జన్మం బెత్తి నాశైశవం
బున నెబ్భంగి దలంచి యుంటినొకొ నే మూర్ఖుండనై బాల్యమం
దున సేవింపఁగ లేదు ప్రోవఁ గదె కొల్తున్ నిన్ను ముక్తీశ్వరా॥

మ॥ నవకం బౌనెఱజవ్వనంబు పయికొ♦న్నన్ గీర్తికాంతావిచి
త్రవిలాసానుభవప్రదం బగు కళా♦ధన్యత్వముల్ గాంచుచో
భవదీయం బగు సేవలన్ మఱచితిన్ ♦ భ్రష్టుండ నైతిన్ దయా
ర్ద్రవిభూతి న్నలకొల్పి ప్రోవు మిఁక నన్ ♦ ధ్యానింతు ముక్తీశ్వరా

మ॥ తమి నిల్పోపమిఁ బెండ్లి యాడి యొకకాం♦తన్ గొంత కాలంబు ని
త్యము తద్భోగపదానుభోగి నయి యం♦తన్ సంతతిం గాంచి యా
మమకారమ్మున నేఁ గుటుంబమును సం♦బాళింప నె న్నెన్ని యో
శ్రమలం గుందుచు నిన్నుఁ గొల్వ నయితిన్ ♦ రక్షింపుము క్తీశ్వరా॥

మ॥ తనువా డస్సెను నాడులున్ సడలె దం♦తంబుల్ దిగం జారె జ
వ్వనముల్ మాసె బలంబు దీసె జరయుం♦ బ్రాపించె మాద్యంబుపై
కొనె దౌర్బల్యము పాపభీతియు నణం♦కుల్ గొల్పసన్ గ్రుంగ జే
సెను సేవింపఁగఁ జాల నందన మిఁదే ♦ చేకొమ్ము ముక్తీశ్వరా॥ 54

మ॥ ధనధాన్యాదిసమస్తసంపదల నొం♦దన్ గోర సౌందర్యభా
జన మౌరూపముఁ గోర సర్వసుఖ♦ సౌభాగ్యముం గోర నె
మ్మనమం దెప్పుడు నిన్నుఁ గాంచఁ గలశుం♦భజ్ఞానవైరాగ్యచిం
తనమే కోరితి నాకొసంగు మిఁకఁ ద♦ద్భాగ్యంబు ముక్తీశ్వరా॥ 55

మ॥ తలిదండ్రుల్ సుతులున్ సతుల్ హితులు భృ♦త్యవ్రాతముల్ హెచ్చు
గల రంచున్ గులకంఁగఁ జూతు నిహలో♦కంబందు మృత్యుగ్రహా [గ్రా
నలకీలాహతి నొందు వేళ నొకరై♦నన్ వెంట రాఁ బోరు ని
స్తుల మాదిక్కిఁక నాకు నీవ కద కొ♦ల్తున్ నిన్ను ముక్తీశ్వరా॥

మ॥ ఇలలో నెచ్చటనో విపత్తులు గలా♦రెబ్బంగి నాశత్రువీ
రులఁ బోకార్చెద నంచుఁ జూతు మఱియే♦రుం గారు నాయింద్రియం
బులె నాశత్రువు లయ్యె వాని నిఁక ని♦ర్మూలం బొనర్పంగ ని
శ్చలవైరాగ్యకృపాణ మిమ్ము నిను నిం♦చ్చల్ గొల్తు ముక్తీశ్వరా॥

మ॥ అనుభూతం బగుతుచ్ఛభోగములపై నాసన్ విసర్జించి నే
వనమందున్ మునివృత్తి నేకతము దేవా నీపదధ్యానమున్
మనమందున్ నెలకొల్పి మోక్షపదసామ్రాజ్యంబు నొందంగ బు
ద్ధిని నా కెన్న డనుగ్రహింతువొకొ నే దీనుండ ముక్తీశ్వరా॥ 58

మ॥ కలశాబ్ధిన్ మథియింపఁ బుట్టినవిషోగ్రజ్వాల లోకంబులన్
గలఁచన్ దద్విషమున్ దయాపరత మ్రింగం బోయి యో నాజగ
ద్వలయంబుల్ నశియించు నంచు విసమంతన్ గంఠమం దాపి ప్రా
ణుల రక్షించిననిన్నుఁ గొల్తుఁ గఱకంఠుం డంచు ముక్తీశ్వరా॥ 59

మ॥ సరసంబైనపదార్థముల్ గలిగి భూషల్ వేషముల్ గల్గి సు
స్థిర మౌసంపద లుండఁ గల్గి సదసద్వేత్తల్ సుతుల్ గల్గి రూ
పరి యౌభార్యయుఁ గల్గి యేమఱచి నిన్ బ్రార్థింప నేమో దయా
పర నిన్నేమఱనట్టిజ్ఞాన మిడి ప్రోవంజూడు ముక్తీశ్వరా॥ 60

మ॥ కులగోత్రంబులు కావు దివ్యతటినీకుల్యాదులున్ గావు సు
స్థలముల్ గావు యశంబుఁ గూర్పఁ గలవిద్యల్ గావు మోక్షంబు సం
ధిలుమార్గంబులు నీవిశుద్ధభజనోద్రేకంబులే కానఁ ద
త్కౌలనంబున్ దయసేయు మయ్య నిను వేడ్కన్ గొల్తు ముక్తీశ్వరా

మ॥ రవియొక్కండె మయూఖజాలములఁ బర్వం జేసి లోకావృతాం
ధవినాశం బొనరించి యెల్లరకుఁ బ్రత్యక్షంబయై వెల్గఁగా
భవదీయం బగుకోటిసూర్యనిభరూపం బెచ్చటన్ డాఁగె నా
యవివేకాంధముఁ బాపి ముక్తి దయసేయన్ రాదె ముక్తీశ్వరా॥

శా॥ రేపో మాపో నశించునీతనువు పేర్మిన్ సుస్థిరం బంచు నా
శాపాశంబులఁ జిక్కి పాపి నయి దుష్కార్యంబులన్ జేసితిన్
దాపై వచ్చెఁ గృతాంతఘోరనరకద్వారంబు లుగ్రంబులై
యాపన్నార్తిహరా యటంచు నిను నే నర్థింతు ముక్తీశ్వరా॥63

మ॥ మొదటన్ వ్రాసినవ్రాతపై మరలఁ దుష్కృల్ పెట్టి వ్రాయంగ నీ
మదిలో బద్ధకమో యసత్యభయమో • మాన్పించెనే కాని నీ
పదపద్మంబులఁ బట్టి వీడనిభవద్భక్తాళి రక్షించి త
య్యది పైదానికి హెచ్చొ లోచ్చొ తెలుపంగా రాదె ముక్తీశ్వరా

శా॥ పాపంబుల్ ఫలియింపకుండు నని నే • భావించితిన్ దైవమా
ప్రాపించెన్ గద తన్మహానలఫలం • బత్యంతమై నామన
స్తాపం బే మని తెల్పుకొందు నికఁ బశ్చాత్తాపమున్ జెందితిన్
నాపైఁ గోపము వీడి ప్రోవఁ గదవే • నాతండ్రి ముక్తీశ్వరా॥ 65

మ॥ రమణీయం బగునీజగద్వలయమే • రంగస్థలం బౌఁ బ్రపం
చము నానాటకమందు నీవు నరవేషంబుల్ ప్రకల్పించి ని
త్యము తన్నాటకసూత్రధారి వయి మిథ్యాచిత్రముల్ చూపుచున్
బ్రముదం బేర్పడ నాటలాడెదవు దేవా లీల ముక్తీశ్వరా॥ 66

మ॥ సుక మొందొకల దంచు యోజన లొనర్చున్ మీఱి గొంతెమ్మకో
రికలన్ మున్గి నిరాశఁ జెంది కడునార్తిం గుందు విద్వత్కళా
ధికతన్ గాంచఁ దలంచు మృత్యువన భీతిం జెందు హృద్భ్రాంగ మీ
ఱిక సద్ధ్యానిభవత్పదాబ్జములయందే చేర్పు ముక్తీశ్వరా॥ 67

మ॥ తెలవారంగనె మేలుకొల్పి యెవఁడే • తీరున వర్తింపఁగా
వలెనో ప్రాణుల కట్లు తత్తగుచితవ్యాపారముల్ కూర్చి జీ
వులకర్మార్జిత మాశుభాశుభము లేప్రొద్దున్ విలోకించి త
త్ఫలపాకం బొడఁగూర్చునీప్రభుత కెవ్వం డోపు ముక్తీశ్వరా॥ 68

మ॥ తను దాఁ గొప్పఁగఁ జెప్పుకొంటయును మాంతన్ వింతగాఁ దోఁపఁ గే
తనదేశంబును దన్నివాసజనులన్ • దద్దేశపున్వస్తులన్
దనదైవంబున లేశమైన నభిమానంబున్ మదిన్ లేనివాఁ
డు నినున్ దా నెటుకొల్చి ముక్తిఁ గొనువాఁడో తెల్పుముక్తీశ్వరా॥

మ॥ తమగుట్టుం వెలిఁ జెట్టునంచు ముఖమంతం బూదితోఁ గప్పి ని
క్కము లో డాఁగక పైకిఁ బొంగు ననుశంకన్ వటువుం దటుహా
రముల నింపి త్వదీయభక్తులుగ సత్ప్రాప్తికై చూయవే
షములం బన్ని హితైకభాషల మనుష్యశ్రేణిఁ గం బ్రామి తు
ద్రమతుల్ భక్తులపేర్లు మాంపెదరు వింతల్గాని ముక్తీశ్వరా॥ 70

శా॥ధీరస్వాంతులు సద్వ్రతాన్వితులు ముక్తిప్రాభవాసక్తులై
ఘోరం బైనతపంబు సల్పిపమునిస్తోమంబె యత్నించి యొం
డోరన్యం బగునీమహత్వకలనాధుర్యత్వముం గాంచఁగా
లేరే నే నెటు నిన్నుఁ జేరఁ గలకల్మిం గాంతు ముక్తీశ్వరా॥ 71

శా॥విద్యం గొంత గడించి తా నొకమహావిద్వాంసుఁడే యంచు స్వ
లోపజ్ఞ్యోగంబున నుండి తా నొకఁడె ధన్యుండంచు నామ్నాయసం
వేద్యుం గాంచియు నైన లెక్కగొన కుర్విం గర్వి గాఁ సర్వవి
ద్వద్మూర్ధప్రతికూలుఁ డెట్లు నిను సంభావించు ముక్తీశ్వరా॥ 72

శా॥ పాపం బెయ్యదొ పుణ్య మెయ్యదొ కళాపారీణు లౌనౌరిచే
రూపింపం బహుధర్మశాస్త్రములు నేరో నమ్మఁగ న్గాని నా
కేపంచంగను పట్టునట్టి విటు లింకే నమ్మి చెట్టొంచు ను
ట్టోపాయంబున మోసపోతి నను ధన్యుం జేయు ముక్తీశ్వరా॥ 73

శా॥ మున్నన్ మిన్నను గానకే నిరతదుర్మార్గప్రచారుండనై
యెన్నాళ్లిగతిఁ దుచ్ఛసంస్కృతిమహాపేటిం విసర్జింప నే
నెన్నం గానక కష్టసంతతుల నెంతే స్రుక్కఁగా నేస్తు నా
యన్నా క్రన్నన నిన్నుఁ జేరఁ గలభాగ్యం బిమ్ము ముక్తీశ్వరా॥74

మ॥ అరిగాటాననవీతిప్రహోత్రుఁ డయి భూమ్యాకాశముల్ పట్టని
ర్భరతం దాళము వేయఁ గిట్టి నిరతప్రద్యోతసత్కీర్తియై
ధరణీంద్రుండయి సర్వభోగములఁ జెందం జాలియు న్నిపదాం
బుజహద్వంద్వముఁ గొల్వకున్న నరకంబుం జెందు ముక్తీశ్వరా.

శా॥ స్వాతంత్ర్యంబును బాసి యొక్కరుని పజ్జం జేరి తన్మానస
ప్రీతిన్ గూర్పంగ దప్పుసాక్ష్యములఁ జేర్మిన్ జెప్పుచున్ సత్యవా
క్రీతిన్ మాసి ధనంబుఁ గూర్పఁ గలవారిన్ మెచ్చుచున్ సజ్జన
వ్రాతంబున్ నిరసించువాఁడు గను దౌర్గత్యంబు ముక్తీశ్వరా॥ 76

మ॥ నిను నర్చింపక నీకథల్ వినక యెంతే నీమహాత్వంబు నె
మ్మనమం దెంచక నీస్వరూపము నుతింపన్ రాక నీనామకీ
ర్తనమున్ జేయ కిహంబు నందు సుఖమొందం జూచువా రంటకం
టను బుట్టందినవెంటఁ జచ్చుటయు నెంతే మేలు ముక్తీశ్వరా. 79

శా॥ నానాయోనులఁ బుట్టి పుట్టి తుదకున్ జ్ఞానచ్యుతాత్ముండనై
నే నీమానవజన్మ మెత్తితిని గానీ మాయలోఁ జిక్కి శ్ర
ద్ధానై పుణ్యము భక్తిమార్గమును జెందన్ జాలకుంటిన్ భవ
ద్ధ్యానానంద మొసంగి ప్రోవఁ గదె చెంతన్ జేర్చి ముక్తీశ్వరా॥

మ॥ ధనసంపాదన కన్యులన్ గొలిచి చేతంబందు నీర్ష్యాగ్రహం
బును సంధించి రజస్తమోగుణములన్ బూజించి దైవంబు లే
డనుభావంబున సంచరించితిని దేవా తత్ఫలం బిత్తఱిన్
గన నయ్యెన్ భవదీయపాదములఁ గాంతున్ గొల్తు ముక్తీశ్వరా॥

మ॥ అవనిన్ దుర్వ్యసనానుభూతమగు దేహప్రౌఢిమంబే సదా
స్తవనీయం బని కండలన్ బెనిచి వస్త్రాదన్ కితా బంది మి
త్రవితానం బొనరించుసన్నుతులఁ జెందన్ జాలితిన్ గాని మృ
త్యువువాతన్ బడనుంటి నంచెఱుఁగఁ గొల్తున్ బ్రోపు ముక్తీశ్వరా॥

మ॥ ధరణీచక్రము గిఱ్ఱుమంచుఁ దనకై తాఁ దిర్గుచున్ వేగ భా
స్కరునిం గొల్వఁ బ్రదక్షిణంబులను వేడ్కన్ సల్పుచున్ గాలవై
ఖరినిన్ మార్చి శుభాశుభంబుల సదా కావింపఁగాఁ గారణాం
తర మీవే యని నమ్మి కొల్చెదను జ్ఞానం బిమ్ము ముక్తీశ్వరా॥

మ॥ రవియొక్కండె సమస్తలోకములఁ బ•ర్వం జేయుచున్ వెల్గులన్
వివిధాదర్శములన్నిటన్ బ్రతిఫలా•ప్తిం గాంచుచున్నట్లు మా
ధవ నీ వొక్కఁడవే జనాళిహృదయా•దర్శమ్ములన్ నిల్చుచి
త్రవిధానంబును నాకుఁ దెల్పు మిఁక నిం•బ్రార్థింతు ముక్తీశ్వరా॥

మ॥ తనగర్భంబున నుండి తంతువుల పెం•తం గొల్పఁ గల్పించి యం
త నిశాంతంబొక దానిఁ గూర్చి యటఁ గొ•న్నాళ్ళుండి యాపైని మున్
తను నిర్మించినదాని లూత మెటు మో•దం బొప్ప భక్షించి లోఁ
గొనునో తద్విధ మీవు లోకములఁ బె•క్కుల్ గూర్చి ప్రేమించి నా
శన మొందించెద వట్టినీమహిమ లెం•చన్ లేము ముక్తీశ్వరా॥83

మ॥ తొలిజన్మంబున నే నొనర్చినయఘ•స్తోమంబె యీజన్మమం
దలఘుజ్ఞానవిహీనుఁ జేసె నను దే•వా నేఁ బునర్జన్మబా
ధల నింకెట్లు భరింపఁ జాలుదును స•త్యజ్ఞానమున్ గూర్చు మా
నళినీకైరవిణీసఖాగ్నినయనా • నాతండ్రి ముక్తీశ్వరా॥ 84

మ॥ మలినంబై మలమూత్రపూరితమునై • మాంసాస్థియుగ్మంబునై
తలఁపన్ రావియసహ్యమై బహుళసం•తాపంబునున్ గొల్పు కాం
తలమేనుల్ దిలకించినంతనె మనో•జ్ఞత్వంబు గల్పింత్రు ప్రా
జ్ఞులె తన్మోసము నంద కుందురటు న•న్నుం బ్రోవు ముక్తీశ్వరా॥

మ॥ మును జన్మంబుల నెత్తినప్పుడు భవ•త్పుణ్యస్వరూపంబు గొ
ల్వనిపాపంబున నాకుఁ గష్టములు సం•ప్రాప్తించె నీజన్మమం
దునఁ గానన్ భవదీయనామమును జే•[illegible] గొల్తున్ బున
ర్జననం బీయకు మయ్య భక్తజనర•క్షాదక్ష ముక్తీశ్వరా॥ 86

శా॥ కన్నుల్ గల్గినభాగ్యకారణమున • న్గన్పించు నీచిన్నెలున్
విన్నాణంబులు నాదిగాఁ గలుగునీ•విశ్వంబు శశ్వద్గతిన్
గన్నుల్ మూసుకయున్న సర్వమును బూ•ర్ణంబైనబింద్వాకృతిన్
గొన్నట్లుండును నీవిచిత్రమును నాఁ•కుం దెల్పు ముక్తీశ్వరా॥ 87

మ॥ అనుభూతం బగు శైశవం బగుగు బాల్యం బేగు నాపైన యౌ
వనసామ్రాజ్యము బీటువోవఁ బిదపన్ వర్ధిల్లు కౌమారముల్
జను వృద్ధత్వము వచ్చు మిత్తివలె నీజన్మంబు చాల్ చాల్ పున
ర్జననం బేటికి నాకు నిత్యసుఖముల్ సంధింపు ముక్తీశ్వరా॥ 88

శా॥ భూమీచక్రము స్యందనంబుగ నభంబు స్నికపర్దంబుగా
స్వామీ దిక్కులు కట్టుపుట్టములుగా వర్ధిల్లు నీ వున్నతా
వేమూలం గల దంచు నెంతు నిఁక నా కీభావముం దెల్పుచున్
బ్రేమం జూపుము నీకు మ్రొక్కెద భవానీనాథ ముక్తీశ్వరా. 89

మ॥ కలలం దోఁచెడుభోగభాగ్యములపైఁ గాంక్షన్ విసర్జించున
ట్లిలలో నస్థిరసంపదుత్కరముపై నేహ్యంబు సంధించు జ్ఞా
నలతాబీజము నాటు మయ్య సుమనోజ్ఞం బైనహృత్క్షేత్రమం
దలుకన్ వీడి మదీయపాపములఁ బాయం జేసి ముక్తీశ్వరా॥ 90

శా॥ ఆద్యంతంబులు లేక భాసిలుచు సత్యాత్మస్వరూపుండవై
చిద్యోగం బొనరించువారలకు స్వస్తిన్ గొల్పుచున్ మోక్షసం
పద్యోగంబు లభింపఁ జేయఁ గలసామర్థ్యంబునన్ గ్రాలు నీ
యుద్యన్మూర్తిని నాకు జూపి నను ధన్యుం జేయు ముక్తీశ్వరా॥

శా॥ నిత్యానిత్యపదార్థభావనకు శానిర్ణిద్రతన్ గాంచి నే
సత్యాకారమె నిత్యవస్తు వని విశ్వం బెల్ల మిథ్యైకగా
గత్యం బొందిన దంచు నైహికసుఖవ్రాతంబు వర్జించునౌ
న్నత్యజ్ఞానము నా కొసంగు మిఁకఁ బంతంబేల ముక్తీశ్వరా॥ 92

మ॥ జననం బందినదాది దుష్కృతము లశ్రాంతంబు గావింపుచున్
దినముల్ పుచ్చుచునుంటి నింతదనుకన్ దేవా భవద్దివ్యమూ
ర్తిని నే నెవ్విధిఁ గాంచనేర్తు నఘకార్తిం గుందఁగాఁ జాల నిం
క ననుం బ్రోవఁగ రమ్ము భక్తజనరక్షాలోల ముక్తీశ్వరా॥ 93

# శ్రీ సానందోపాఖ్యానము.

(హరికథ)

ఇది

గుంటూరు మండలమునందలి సంతమాగులూరు
గ్రామవాస్తవ్యుండును, సుకవిజన మిత్రుండును నగు
పొత్తూరి రాఘవయ్య కవిచే
విరచింపబడి

సంతమాగులూరు గ్రామనిలయుండును వైశ్యకుల
తిలకుండును, భగవద్భక్తుండును నగు
గుఱ్ఱం సుబ్బరామయ్య శ్రేష్ఠి
ద్రవ్యసహాయముచే

బెజవాడ వాణీముద్రాక్షర శాలయందు
వి. కే. స్వామిచే
ముద్రింపబడియె.

---

కాపీరైటు] 1916. [వెల 2 అణాలు.

మంజరి ద్విపద.

శ్రీరమ్యసౌధర జెలగినసంత । మాగులూరనెడి గ్రామంబున
గల్గు । వైశ్యకులంబున వన్నియగన్న । నాభిళ్ళగోత్రంబు నందుద్భవిం
చి । వరలు గుఱ్ఱమువంశ వర్ధనుండైన । సుబ్బిశెట్ట్యాఖ్యుడౌ సుజనవిధే
యు । డాదెమాంబికయందు నం. బుత్రులను । నలువుర పెదిశెట్టి నర
శింహులు, గురవ । యాభిఖ్యు, వెంకటప్పయ్య సద్ఘనుని । నందు నృసిం
హుని కాత్మజుండగుచు । దగిపెద్దిశెట్టికి దత్తపుత్రుండు । నై మించుసు
బ్బరామాఖ్య సజ్జనుడు । ప్రీతినన్నొకనాడు పిలుపించి "సుకవి! । చదు
వుడిత్వత్కృత సానందచరిత" । మనుచు నన్నడుగ నే నానందమంది ।
వినుపింప దావిని వేడుకజెంది । ముద్రణగావింప బూని యద్దాని । సా
ర్థకపరచెనా స్వార్థపరుండు । నామహామహున కష్టైశ్వర్యములను ।
గలిగించు నిరతంబు గరళకంఠుండు । ఈకృతి వెలయుత మిలచంద్ర సూ
ర్య । తారకముగను నిర్ధారుణియందు॥



శ్రీ రామాయనమః.

# శ్రీ సానందోపాఖ్యానము.

(హరికథ.)

## ఇష్టదేవతా స్తుతి.

క॥ శ్రీరాముని సుందరికై । కోరికలూరగ నన్ను కుప్పించిన యా
ధీరుని నిజజని తనయుని । వారక సేవింతు హృదయ వారిజమునన్॥

క॥ గణనాయకు పరిభూషిత । ఫణినాయకు భక్తలోక ఫలదాయకునే
గణుతించి మ్రొక్కి వేడెద । విమలోగసికృతి నిఘనిని వెలయించుటకై॥

కీర్తన. శంకరాభరణం — అట.

నమామి శ్రీగణనాయకా నిత్య । మేము గొల్చెద బాయకా । అమేయమగు దయనాదరించి నన్ను మేటి సుతునిగ జూచి బ్రోవర॥ నమామి॥ ౧

పరాకు సాయక బ్రోవరా నీ స్వ । రూప దర్శన మీవరా । వరాలడుగ లేదురా । మురారిని నిరాకరించక గురూ స్తులీవర॥ న॥ ౨

బలారిముఖసుర పూజితా । మూంగులుగారిపురి పరిపాలితా । విలాసముగ కృతినిలోపమెంచక । బలాయుసంగను చెలంగ జేయర॥ న॥ 3

క॥ వాణి స్వాంతతనుత గీ । ర్వాణి స్మృతమధుర వాణి పద్మజురాణిన్ ।
వీణాపుస్తకరంజిత । పాణిన్ ఘనసిలవేణి బ్రస్తుతి సేతున్॥

కీర్తన ఖమాచి — రూపకము.

శ్రీభారతి నజసతి సన్నుతి సుగుణావలి శ్రితజనవసతీ । వైభవోన్నతీ నీనాదభారతీ మునిగుణనుత॥ శ్రీ॥

వాణీ యలివేణీ విధిరాణీ ఘన । వీణామృదువాణీ దయన్ బూను మమున్ నుతగీర్వాణీ సన్నుతి॥ శ్రీ॥

భూరీ కిల్బిషపరిహారీ పొత్తూరిరాఘవా! సూరివరాకృత సత్కృతిభూరి దయస్గావుమరిక్॥ శ్రీ॥

కవి స్తుతి.

క॥ నన్నయ తిక్కన మొదలగు। మున్నిటి కవివరులకెల్ల మ్రొక్కులిడి సదా। సన్నుతి జేసెద నిప్పటి। ఘన్నపుకతగూరుపరుల పొలుపుగ మదిలోన్॥

క॥ సుకవులు తప్పుల నెంచరు। కుకవుల కిది నైజబుద్ధి కోరికలలరన్ ప్రకటముగ బొమ్మలాడగ। నకటాహాస్యంపు ప్రీతిమలవనిలేవే॥

క॥ లక్షణ శాస్త్రంబులనే। వీక్షింపగ లేదు నా కవిత్వమునందున్ లాక్షణికులు దయయుంచి స। లక్షణవంతముగ జేసి లక్షింపదగున్॥

వ॥ అని యిట్లిష్టదేవతా వందనంబును సకల సుకవి జన స్తుత్యంబును కుకవిజన తిరస్కృతియును గావించి శ్రీమద్ధనుమద్వర ప్రసాద లబ్ధప్రవర్ధనీయంబగు సద్వంశంబభివర్ణించెద.

సీ॥ వసుధ పొత్తూరిసద్వంశాబ్ధి సోముడై వీరయ్యనామక విబుధవరుడు పరిణయంబందెను పద్మాక్షులిరువురి శ్రీసేమయ్య సుతనను పెద్దభార్య జాలమ్మ యనియెడు చానయందునగాంచె పుత్రునొక్కని రాము బుధవరేణ్యు। నలచిన్నభార్య మహాలక్ష్మియందున సుతులనిరువురగనె సుగుణాధనుల। యందు జ్యేష్ఠుడు కోటయాభిధానుడు వాని కనుజుండు వున్నయ యానఘుమూర్తి। కోటయాభిఖ్యుడు కూరిమి వెలయంగ వచ్చెమాంబను తాను పెండ్లియాడె। యామిథునంబున కవనిజన్మించిరి పుత్రులిద్దరు మహాబుద్ధిమంతు। లనఘుడు పెద్దవా రడయంగ వీరయ్య వానితమ్ముడు రాఘవాభిదుండ। నాంజనేయు నికరుణ నే నాత్మనమ్మి। నెమ్మిసోదుతసానందు నికథ నేను। హరికథగ జేయబూనితి నార్యులార। చిత్తగింపుడు సత్కథ చెప్పులు దనియ॥

వ॥ ఆర్యవర్యులారా యేను శ్రీమద్రామచంద్రచరణారవిందగళదమందమధురమకరందబిందుబృందపానపరవశమిళిందాయమానమానసుండగు పవమాననందను దయార నేక్షణంబునకు పాత్రీభూతుండనై యొ

నర్పంబూనిన సానందోపాఖ్యానం బను హరికథకు కథా క్రమం బెట్టిదనిన.

—* కథా ప్రారంభము. *—

తో॥ శంకర సాధువ శంకర భవనా శంకర కుండలిభూషా
సంకటహర మీనాంకవిజిత శివశంకర నతజనపోషా
మారుతి మారుతి మారుతి యనిమది మానక యెప్పుడు యనుచూ॥
చారుతరంబగు సానందునికథ చయ్యన దెల్పెద వినుడీ
పాపములెల్లను బాయగదోలెడి బదరికాశ్రమమునందు॥
నేపట్లను వసియించుచు నుండును నిజసతితోఁ గూడి యుందూ॥ శంకర॥
భూమిలోన తా పూర్ణవిష్ణుడను భూమీసురవర్యుండూ
హేమకశ్యపి సామ్యుడనుంచన యొంచగ గాపురముందూ॥ శంకర॥
వెలయగ మాతనికులసతి గుణమున వేశ్యలు రాజిల్లగనూ
పలుజిహ్వలుగల శేషునికైనను పలుకగ నేరని యుండగనూ॥ శంకర॥

వ॥ మఱియు నా నారీశిరోమణి గుణంబు లభివర్ణింప శేషాహికైనను తరంబుగాదు. అట్టి దిబుకల కొలికింగూడి పూర్ణవిష్ణుం డత్యంత కుతూహలాయత్త చిత్తుండై పాపవినాశనంబగు బదరికాశ్రమమునం దెక్కకాలంబు వానప్రస్థాశ్రమంబు జరుపుచుండె నంత నొక్కనాడతని కులసతియగు భద్రదంతి నాయకుని పగసంసారహద్ద్వంద్వంబునకు నమస్కరించి నిటలతటఘటిత ముకుళితకరకమలయై యిట్లనియె.

తో॥ జీవితేశ విను జనములనెల్లను జీవనమును దలపంగా
భావంబలరగ పుత్రులెకాదా పాడితను తనరాదంగా॥ శంకర॥

దర్బా—కళ్యాణి—రూపకం.

నాథా ధరగల । నరులకుజీవనము । నాదాతనయులు కరుణానను బ్రోవుమో॥ నాథా॥

తనయులు లేనిసిరి తలపగ వనమున । ఘనమృగ గతి లేక గతియే గదవా॥ నా॥

పుడమీసురవర కొడుకులు లేనిసిరి । నడవినిగాయువెన్నె లగు
గదయెంచగ॥నా॥

స్థిరముగ రాఘవ వరకవి నేలెడి। పరమేశుండిదె పాలన చేయడె॥నా॥

వ॥ అదియుంగాక కొందరు పెద్దలు.

క॥ ముందుగ ప్రొద్దున లేచియు । నందనులంగాంచనట్టి నాతిం జూడన్
పొందును పాపంబనియెద । రిందున కేనుంకు జీవితేశ్వర చెపుమా॥

వ॥ అని యిట్లు వగచి బాష్పజలకణ పూరితనేత్రయై కన్నీరు మున్నీరై చన్గొండల మధ్యంబుగ ప్రాణనాథుని పాదారవిందంబులం బ్రాలి లేవకయున్న యన్నారీరత్నముం గాంచి పూర్ణవిత్తుం డత్యంతదుఃఖాక్రాంతచిత్తుండై కాంతామణిం లేవనెత్తి.

దరువు—ఆట.

సారసాక్షిరో నామాటవిని । నగవగతగదిక॥సా రా॥

కారుణ్యసారా నా మొశివు । జేరినుతింపు సుదినిని॥సా రా॥

ఆ మహేశుని నుభినుతింపగా । కామితార్థచయముమా । కామినీ
మనకా సామియొసంగు । ప్రేమానీవ్చుమోదవె॥ సా రా॥

కరుణారాఘవా వరకవీశునీ దురితములబాపి బ్రోవుమా। సారా
మేశునీ జేరినుతిని మీరీసద్భక్తి వేడుమా॥సా రా॥

తోహరి॥ తరుణీమణిసంతతిక్కై వగచిన తప్పునవిధికృతమంతా॥ శంకర॥
కరుణాయతచిత్తుండగు యలకర కంపు ముకుపుమన చింతా॥ శంకర॥
తరళాక్షిరో యాపరమేశుండా దాతసార్వభౌముండూ
కరుణతోడ సురవరునికిచ్చెగద సుసభోగంబులతండూ॥శంకర॥
యిప్పుడు నేనాయిభచర్మాంబరు నెంతయు మదిగీలించి
తప్పక నేతపమాచరించి యా దాతనుమది మెప్పించీ॥ శంకర॥
వలసిన కొమరునికొనివచ్చెదనో వనితామణి వగవకుమా
యలశంకరు ధ్యానించుచు నిప్పుడు యతివాయిటగదలకుమా॥శం॥

వ॥ అని యిట్లు కులసతిశోకంబలికి యబ్జాసురవరుండు చిలుకరౌతు వైరికడకేగ సుద్యుక్తుండై తనమనంబున శివు నిట్లని ధ్యానించె॥

## దర్వు—ఆట.

గిరిజానాథా నిరతము వేడెద । కరుణించి దానను గావుము మ్రొక్కెద॥ గిరిజా॥

పరమదయాకర మరువకనీపద । సరసిజములనే చాలనుతించెద॥

ధరణినిరాఘవ వరకవి నేలిన । పరమేశానిను ప్రార్థన జేసెద॥గిరి॥

వ॥ అనియిట్లు ధ్యానించుచు నభ్యాసురవరుం డొక్కయాశ్రమంబు గల్పించుకొని భక్తపరాధీనుండగు శంకరుని హృదయంబునని ల్పుకొని॥

తోహర॥ తపము సేయుటకు యత్నకృతుడై తపసివేషమునుబొందీ

జపమొనరింపగ మదిలో నప్పుడు చాలకౌతుకమునొందీ॥ శంకర॥

ఆశాపాశము లంటగోసి పరమేశు వేడ్కమదినుంచీ

వాసిగపంచేంద్రియములనప్పుడు వరుసతోడబంధించీ॥ శంక॥

అత్యులమూనుక కుక్షినజాండము శిక్షణజేయుచునపుడూ

దక్షశిక్షుపాలాక్షునినప్పుడు కుక్షినినిలుపుక యతడూ॥శంకర॥

రెంటినడుమనూ జంటబాయకను యొంటియుంటకుండెడువానీ

దంటయైనముక్కంటిని దలచుచు తపమొనరించెనుపూనీ- శంకర॥

వ॥ ఇట్లు ప్రమథనాథుండగు పరమేశ్వరుని మదినిల్పి ఘోరంబగు తపంబుజేయుచుండ నాతపోగ్ని జ్వాలలుహెచ్చి భూనభోంతరాళంబు భోరుకలుగంజేయుచుండ కరుణాయత్తచిత్తుండును సకలభక్తలోక వశంకరుండనగు శంకరుండు ప్రసన్నుండై.

క॥ అనలాక్షుండా భూసురునకనగోచరుడై వెలసి నిల్చి నిలిచెను తానై
న్ననిలేవనెత్తియాతడు । కనగొని పరమేశుపాద కంజంబులకున్॥

క॥ వినయంబున ప్రణతుండై తనకరములుమోడ్చినిలిచి తానాశివునిన్
గనుగొని భక్తియుతుండై । మునికొని స్తోత్రంబుచేసె మోదముతోడన్॥

క॥ కరకంఠశంభుశంకర । గిరిజాచేతోవిహార క్లేశవిదూరా

పరమేశమేరుధీరా । సురనాయక సేవ్యచరణసురరిపుహరణా

దర్వు—ఆనందభైరవి అట.

శంకరా భవనా శంకరా - భక్తవశంకర శంకరా॥

గజచర్మచేలా - భీకరశత్రుఘాల - శ్రీకరగుణజాల - సాకర నన్ను లీల॥ శంకరా॥

చారుహార మాగు లూరివిహారవా - త్సూరిరాఘవపోషా - భూరికుండలిభూష॥ శంకరా॥

ఉ॥ ఓయిమహానుభావ కనుమోయి దయారస వీక్షణంబుచే
నోయిపురారి దాసజనులూర్జితభక్తినిరంతరంబుని
న్నాయకసేవసేసిన శుభంబులనిత్తువటంచు నమ్మి న
శ్రేయసమిచ్చుయించి నినుజేరి భజించితి వాంఛదీర్పవే॥

వ॥ అనియిట్లమ్మహానుభావుని స్తోనియాడి నందయాళుండై ప్రమధ నాధుండిట్లనియె॥

తో॥ హర॥ యేమిగావలయునడుగు మన్నియును యిప్పుడె వేగమెరమ్ము
కామితార్ధములనిచ్చెదనీకును గట్టిగ మదిలోనమ్ము॥ శంకరా॥
అనివిని భూసురు డాదేవునితో నప్పుడిట్లువచియించెక
వినుమోశంకర నీవెరుంగనిది వేరున్నదె యోచించక॥ శంకర॥

సీ॥ సీతాద్రితనయ సచ్చేతోవిహారాయ మారహరాయ నమశ్శివాయ
భూతిధరాయసుపోషితభక్తాయ మారహరాయనమశ్శివాయ
బాలచంద్రధరాయపాకారివినుతాయ మారహరాయనమశ్శివాయ
సురమునిసేవ్యాయశోభితాంగశివాయ మారహరాయనమశ్శివాయ
నీవెరుంగనిదదిరెద్దినీలకంఠ త్రిపురవిధ్వంససుతునికై తపముచేయు
చున్నవాడను సత్సుతుడొకడుచాలు-పలువురేటికితారలపగిదినిశిని॥

వ॥ ఇవ్విధంబున నభ్భూసురవరుండుబల్కిన కాళికానాధుండిట్లనియె॥

తో॥ హర॥ నాకుసముండగు నందనునిచ్చితి నామాటలుమదినమ్మి
ప్రాకటముగ నీభూతిపండు నీభార్యకు వేగమొయిమ్మి॥ శంకర॥

గీ॥ అనుచువరమొసంగి యంబికానాధుండు। ప్రమధగణముతోడ ప్రమదమెసగ। చనియెరజితగిరికి మునిసంఘములుగొల్వ। వృషభతురగమెక్కి వేడ్కబొదలి॥

వ॥ యిట్లు శుభముహూర్తంబున సుజనులెల్ల రానందంబు నొందుచుం డ భద్రదంతి సుతుసింగనినవార్త పూర్ణవిత్తుంమువిని సంతోషవా ర్ధినోలలాడి శక్తికొలది భూసురవర్యులకు గోభూహిరణ్యాది దా నంబులనొసంగి దశదివసంబులుం గడచినవెనుక సర్వజనానందుండ గుంగావున సానందుండను నామంబిడి సంతసంబుననుండె నాశిశువు ను దినదిన ప్రవర్ధమానుండై పెరుగుచున్నంత

తో॥ ఇట్టులుండు తనపట్టినిజూచుచు - యెంతోసంతసమందీ।
గట్టిగ నుపనయనంబుజేసెతా - ఘనగురుత్వమును జెందీ॥ శంక॥
చదువవేసినను సానందుండా - చదువుల మర్మములెల్లా।
పదపడజదివియు పంచాక్షరినను - భవముజెందె గురువల్లా॥శంక॥
పరమేశుని ధ్యానించుచు - నాతడు భక్తకోటితోగూడి।
నిరతముయీశకర కంతుచరితములు - నిశ్చలముగ వినువేడీ॥ శంక॥

వ॥ యివ్విధంబున నాసానందమౌని రెండవ చంద్రశేఖరుండునుంబోలె షోడశకళాపరిపూర్ణ సుధాకరుచందంబున దండకమండలకాషాయ శాటీపరిధానయుక్తుండై విభూతిరుద్రాక్షమాలికా లంకృతదివ్య సుందర విగ్రహుండునై సనాతనయోగీంద్రుని తెరంగున విహరిం చుచుండె నొక్కనాడు

తో॥ ప్రాతఃకాలంబందున లేచియు - పరగజపంబొనరించీ।
ఖ్యాతిగినామృగ చర్మాంబరుమది - కలుషముదీర నుతించీ॥ శంక॥
మౌనిబృందములు నున్నయెడకు - తామహిమమీరగను గంగా
గనుగొనివారలు సానందుని మదిగౌరవమున - జూడంగా॥ శం॥

వ॥ ఇట్లు వితర్కించిరి.

బేహాగ్ — ఏకతాళం.

ఎవరీబుషీంద్రుడు భవుసామసాంద్రుడు । భవుడానిచూడగ ఫాల నేత్రములేదు॥ ఎవ॥

వై కుంఠుడోయన వరచక్రమునులేదు । అకళంకుడగు యల సకలేశుభక్తుడు॥ ఎవ॥

ధర రాఘవాదాను దయనేలెడీశు । నిరతము వేడెడి వరరుషి చంద్రుడే॥ ఎవ॥

శో॥ సానందుండని మదిలోనెంచుచు । చత్వనమునివరులిచ్చట ।
మానుగనలరుచు నెదురుగజని । సన్మానమునను దోడ్తెచ్చి ॥శంక॥
ఉచితాసనమున నుండజేసినను । యొనరగమానులగాంచి ।
శుచివదనుండై పలికెనిట్లనుచు । సుగుచిగ మోదమునుమించి॥ శంక॥
మునివరులారా యేకోసత్కథ । మోదము సంధిలనాకు ।
వినగాదెల్పుడు వినియొనరించెద । వేడ్కవందనము మీకు॥ శంక॥
అననఘుడు ధర్మప్రసంగుండను । నాసానందుని గూర్చి॥
వినుమా తెల్పెద పుణ్యాపాపములు విశదంబుగ సమకూర్చి॥ శంకర॥

ద్విపద—కీరవాణీ—అటతాళం.

వినవయ్యసానంద విశదంబుగాను । ఘనదోషకరమైన కలియుగంబునను । దానధర్మంబుల తప్పకనెపుడు । మానుగాక్రతువులు మరి జపంబులును । ఘనముగజేసిన కసుధర్మపరులు । యనయుంబుసుతహితుల్ తనుగొల్చుచుండ । నందరితోకుత నానందమొంద । పొందైనమాటలు పొసగంగనాడి । యాయాస మొక్కింతయైనను లేక । మాయగాప్రాణముల్ మరివిడనాడి । సుకుమారతనువుల జొచ్చివేగమున । నకలంకమతులయి నాశమనభటులు। సకలోపచారముల్ సల్పుచునుండ - ప్రకటసౌఖ్యములొంది పరగజనుచుండ॥

సీ॥ మహనీయ నవరత్నమయసౌధసంతతుల్ భాసురస్ఫటిక సోపానములును - గురుతర వైడూర్యకుడ్యసంచయమును వలపులొల్కెడి పుష్ప వాటికలను - నానాఖగధ్వని నవ్యమాకొలకులు శుకపికారావ భాసురవనములు - చందనాగరు ధూప మందారదామముల్

తతచిత్రవస్త్రవితానములున - స్వర్ణయుత రత్నభూషణచయము
లరయ - మెత్తనౌదూది పరుపులు మిగులగలిగి - సకలశృంగార
కలితప్రశస్తమగుచు - సరసమై యొప్పు పుణ్యాత్ములరుగు తెరవు॥

వ॥ మరియు నప్పుణ్యపురుషు లత్యంతవైభవంబున నాపుమార్గంబు
నందు శమనదూతలచ్చెరువు చ్చెక్కుటుల కాలవట్టములొసంగి చండ
కిరణుదోర్దండతాడనంబులు సోకకుండ నెక్కి బట్టుడని వచియించువారును
కిన్నరకన్నియాల సురటీలబట్టనిచ్చి ఇప్పురుషులకప్పుడప్పుడు వీచుచుండ
నువారును యచ్చర చేడెలనాడుడనిముచ్చటించువారునుచందనాది
లేపనంబు లీపుణ్యులకలందుడనువారు నై పుణ్యాత్ముల మనంబుల
సంతోషమగ్నులంజేసి యమునిద్వారంబుజేర్చి శిసునుంగని దండప్ర
ణామంబులాచరించి భూమియందుగల పుణ్యులను తమయాజ్ఞచే
దెచ్చినామని దెల్పిన యముండు సంతోషభరితస్వాంతుడై

తోహర॥ కింకరవర్యులుగోలువనప్పుడిట సొంకముగాతాగదలీ
శంకదీర్చుటకు చిత్రగుప్తునచయ్యనరమ్మనబొదలీ॥ శంకర॥
భూరివైభవముతో ఉటు నాతని పుణ్యులకిటుకే తెంచి
ధీరతతో నాపుణ్యపురుషులను తేజ మెసగగాంచీ॥ శం॥
కరణంబగునా చిత్రగుప్తునిగనుగొని వీరలుభువిని
సరగున నొనరించిన పుణ్యంబులు చయ్యనదెల్పుము చెప్పినీ॥ శంక॥

వ॥ అనిన చిత్రగుప్తుండిట్లనియె.

ఖరహరప్రియ — ఆదితాళము.

వేరువేరుగను - వీరలపుణ్యము చేరిదెల్పెదనేను చిత్తగింపుము
దేవ॥ వే॥

యీఘనుడీశునకు యెంతోవిచిత్రముగ - మాఘమాసపూజ
మరిమరిజేసెగా॥ వే॥

కఱకు రాళ్లును కడుభీకరమగు ఖరమృగసంచయముండూ
తిరముగ గురియును నిప్పులవానలు తేజముమెరయగమెండూ॥ శం॥
పిడుగులు నలుగడ ఫెళఫెళమనుచును బెడిదముగా బడుసెగనూ
గడగడనోడలు వడంకగ వారలు పుడమిబడుదురతివగనూ॥ శం॥

వ॥ ఇట్లతిఘోరరంబగు మార్గంబునందు శమను కింకరులు పాపులనుబట్టి కట్టి కొట్టికొని యమపట్టణంబునకుంజనుతరి వారకులు ధృతిగలిగి॥

హిందుస్తానీ తోడి—ఆట.

ఒక్క నాక్షణను ముక్క లేక చునమున । చక్కగదలచము అక్కటమనవు॥ఒ॥

అక్కమలాక్షుని కొక్కప్పుడైనాను । మ్రొక్కమైతిమింక దిక్కెవరుమనకు॥వా॥

చేరా మొకప్పుడూ శివభక్తిపరులను దూరుచుంగుము భక్త ధరూలనెల్ల॥ వా॥

జూదంబులాడితిమి మోదంబుతోనప్పుడు ఖేదమొందగజేసె వేధ మననిటుల॥

తో॥ అని యీరీతిన దుఃఖములోం దేడి యాపాపాత్ముల గాంచీ
ఘనమగు కోపముతోనితని నప్పుడు కాలునిదూతలు మించీ॥ శంక॥
పండ్లునూరుకుచును పాపులనందరి ముండ్లపైని నీడ్చుచునూ
కండ్లలోన బల్లెంబుల గ్రుచ్చుచు కడగండ్లను ముంచుచునూ॥ శంక॥

క॥ ఈరీతి ఖలులనందర । ఘోరముగా శమనభటులు కోరికలలరన్
మీరినకోపముతోడుత । చేరిచిరలతరణిపుత్రు చేరువకువెసన్

గీ॥ ఇవ్విధంబున గొంపోయి యినజుకడకు । భటులు ముందుగ నేతెంచి ప్రణుతిజేసి । భూప మీయాజ్ఞ నొప్పున భూమిలోని । పాపులను దెచ్చినారమో పరమపుణ్య।

వ॥ అని యిట్లు భటులు తెల్పినవినిశమనుండు కోపోద్దీపితమానసుండై.

తో॥ కడువడితోడుత నార్భటించుచును కన్నుల నిప్పులురాలఁగ
బెడిదముగా కనుబొమలు వేగమే ముడిగొల్పుచు తాలిలఁ॥ శంకర॥
దున్న నెక్కి తద్గళఘంటా ధ్వని మిన్నున నెంతయు మ్రోగఁగ
కన్నులనిప్పులు జలజల రాలఁగ ఖలులందరగని వేగఁ॥ శంకర॥
కరణములగు నాచిత్రగుప్తులను కడువడితోడుకొని
తిరమైయొప్పెడిసూగులూరిపురి మగుదాత్మజు మదిదలచుకొని॥శం॥

వ॥ ఈప్రకారంబుగా యమధర్మరాజు కోపంబు దీపింప పాపులకడకేగి చిత్రగుప్తుంగాంచి వీరలు భూలోకంబున నేమేమి పాపంబులాచరించిరి చెప్పుమనిన నాతండిట్లనియె.

సీ॥ దేవతాదూషకుల్ ద్విజవిరోధులు గోహరుల్ పరసతి గోరువారు । మద్యపాయులు గురుమానవ హింసకుల్ ధర్మచోరులు పాపకర్మరతులు । పరధనాసక్తులు బంధువిరక్తులు గురునింద జేసిన క్రూరమతులు । మిత్రవంచకులు స్వామిద్రోహచిత్తులు మాంసవిక్రయులు యీమనుజులరయ । శివుని నిందించు చుండెడి చెనటివీడు। జీవహింస యొనర్చిన చెడుగువాడు । భక్తజనులను దిట్టిన పాపివీడు । ధర్మశూన్యుండు వీడునో ధర్మరాజ॥

సీ॥ వాసుదేవునినైన వామదేవునినైన సేవించి చూడని చెనటి వీడు।
కరకంఠునేనియు కంజాక్షునేనియు పూజింపలేని దుర్బుద్ధి వీడు
మామనోహరునేని ఉమామనోహరునేని పొగడనేరని క్షుద్రబుద్ధి
వీడు । కేశవుగుడికేని నీశునిగుడికేని నడవనేరని నీచ నరుడువీడు

పీరలందరు జూదరి వారు వారు । కానులకు పిల్లలమ్మిన కలుషమ
తులు । వీరు మాతాపితరులను దూరువారు । వారు కులకాంతల
ను వీడువారు దేవ॥

వ॥ అనిన విని మండిపడుచు విజ్ఞానేశ్వరంబను ధర్మశాస్త్రిను సారంబు
గా పరీక్షించి భటులం జూచి యిట్లనియె.

తో॥ గృహదాహకులను గురుద్రోహులను కీలికీలలను గాల్చి
మహిమమీరగను పరసతిబట్టిన మనుజుల పెనముల జేర్చి- శంకర।
విద్యయునన్న ముకన్యలనమ్మెడి విప్రుల కొనుపులగాల్చి
మద్యపానులను మాంసభక్షకుల మరిమరి కండలు జీల్చి॥ శంకర॥
పగగొని భ్రాతల బాధలదూరిన పాపుల గొంతల ద్రోసి
వగబోగులగ వ్యభిచారులనందరి వరుసనగ్నిబడ వేసి॥ శంకర॥
మిగిలిన ఖలులను మీమీ నేస్తులు నెరయునటుల గావించి
మిగులభాధల జెందజేయుడీ మేరమీరకను యెంచి॥ శంకర॥

వ॥ అని యివ్విధంబున భటాగ్రేసరుండగు వీరసేనున కాజ్ఞయిచ్చి తన
వ్రేలిముద్రిక నొసంగిన భక్తింగైకొని దండధరునకు బ్రణమిల్లి య
వ్వీరుండరుదెంచి తద్వృత్తాంతంబంతయు కింకరుల కెరింగింప వారు
నుం జెలరేగి ప్రాస ముసల ముద్గర భిండివాల గదాదండ ధనుర్బా
ణ కృపాణకరపత్రి ప్రముఖ నిఖిల సాధనంబులుగైకొని లంఘించు
చు బెడబొబ్బలిడుచు వెడనవ్వుల నవ్వుచు ముష్టిఘాతంబులం బా
ధింపుచు బెదరు నటుల నారకులం గొట్టుకొనిపోయి యన్నగరి ద
క్షిణ ద్వారంబునందునం బడద్రోసి ఘోరంబుగా బాధింపుచుండు
రని ధర్మ ప్రసంగుండు తెల్పిన విని సానందుండు విస్మయంబంది
మానివరున కిట్లనియె.

తో॥ ఓమునినాథా మీపల్కులు విన నామది చోద్యంబయ్యెన్
భూమిలోన పుణ్యాత్ములు సుఖములు బొందుటమేలయ్యెన్॥

ఘోరదుఃఖముల గుందు ఖలులపై గొంచెము శివ కృపరాదా
దాసిజూపకయుంట జూడగా దద్దయుకష్టముగాదా॥ శంకర॥

కాఫీరాగం—చతురశ్రగతి

హరునకు తగునా సరియిది యగునా। ధరఖలులపయి నింతటి పగజనునా॥ హ॥

పురహరునకు యందరు సరియన ముని। వరవినయముఁ ధరణీస్థలిని॥ హ॥

వ॥ అని యివ్విధంబున ననుచు నమ్మునులం గని.

తో॥ మునివరులారా మీరల్లందరును మోదంబలరగ నెంచుమీ
యినపుత్రునిపురి జూడగబోవుద మింపుగ నాతోగందుమీ॥

వ॥ అని మోదంబరుచుకొని దయార్ద్రచిత్తుండగు నీశ్వరు నిట్లని పినుతించె.

క॥ పరమేశ్వర గిరిజాధిప। కరకంఠ త్రినేత్రయీశ కామహరశివా
పరమదయానిధి సురనుత। వరమానిస్తోత్రపాత్ర వాసుకిహారా॥

దర్వు—శ్రీరాగం—ఆది.

పరమేశ్వర కరుణాకరశివ। కరకంఠపుర హరభూరిహర। సారె వేడినారా। నేరమేర బ్రోవరారా॥పర॥

చేరి వేడినారా రారక్లేశదూర భూరిభుజగభూష బ్రోవరా ఘన పోష తారకేశధార సూరివరవినుత। చేరికొల్తునిన్నే శివాభక్త పోషా॥ పర॥

వ॥ అని భక్త జనవశంకరుండగుశంకరుండనమనంబునం ధ్యానించుచుం
డ స్తోత్రప్రియుండగు కాలకాలుండు సానందుని మనోభీష్టంబెరింగి
కైలాసంబునుండి పుష్పకంబుబంపిన నచ్చటిమునివరులతోడసానంద
ఋషివృషభుండు న వ్విమానంబధిష్ఠించి వేణువీణా గానంబులును
మంగళతూర్యంబులును పుణ్యాంగనాజనాశీర్వాదవిశేషనాదంబులు
ను నొక్కుమ్మడి మ్రోయవృషభధ్వజంబు మెరయ కదలియమపురం
బున కరుగుచుండె నంతనక్కడ।

తో॥ సకలధర్మములు శంకలుదీర్చెడి సంయమివరులుచెలంగఁ
నొక్కవైపున గంధర్వులు యక్షులు నొసరగతను గొలువంగా॥ శం॥
వలసినకార్యములెల్ల జేయుచును వలనుగ భూతములుండా
కలస్వనంబులతో గంధర్వులు బలుగానము జేయుచునుండా॥ శంక॥
కంకణరవములెసంగ చామరలు గరుడకామినులువిసరా
పొంకముగా వేదములుజదువుచును భూసురవర్యులు ముసరా॥ శంక॥

వ॥ ఇట్లు పరమానందంబున గొలువుదీర సింహాసనంబున గూర్చునియు
డుసమయంబున దదాస్థానమంటపద్వారంబునకు నారదుండేతెంచిన
ద్వారపాలకులు తద్వృత్తాంతంబు దెలుపనతండు॥

తోహర॥ నారదమౌనికి నెదురుగజని సంతసమున దోడ్తెచ్చి
చారుతరంబగు గద్దియెనునిచెను చయ్యన మ్రొక్కుచు మెచ్చి॥ శం॥
నారదసంయమివర మీరిచటికి జేరినంతమాత్రమునా
దీరెపాపములు ధన్యతగాంచెడి తెరవుగంటి చిత్రమునా॥ శంక॥
ఏమికార్యమునకై యిటువచ్చితి రింపుగ నాతో జెప్పుడు॥
నేమముతోడుత జేసెదనన మునిశేఖరుడిట్లనెనపుడూ॥

మ॥ ఘనుడుఁ శంకరమంత్రసిద్ధుడులసత్కారుణ్యచిత్తాబ్జుడ
త్యనఘుండున్మనిసార్వభౌముడుననౌ సానందమౌనీశ్వరుం

డినపుత్రోత్తమత్వత్పురంబుగనగా నేతెంచు దానిప్పుడిం
కనునీపాపులసందరి న్గొనుచు వీకన్ జేరు కైలాసమున్

వ॥ యివ్విధంబునబల్కిన నారదుంజూచి శమనుండిట్లనియె॥

శోహార॥ పంకజహాసన ప్రముఖులనరసిన భక్తుడు భృగుమునికంటే
కౌంకక తాప్రతిసృష్టియొనర్చిన కుశికతనయఋషికంటే॥శంక॥
శిష్టుడైన శాండిల్యునికంటే శ్రేష్ఠుడు గౌతముకంటె
సిష్టుండైన వసిష్ఠునికంటె నిరుపమానుడేకంటే॥శంక॥
వనజాసనునకు తనయులైన మూవంటివారలీపనికీ
చనుదెంచిన మాతరమే వర్దన సరసంబే యీమునికీ॥శంకరీ॥
వింతగాను వినుపించితిరిప్పుడు విసువనిచింతజనించెన్
పంతముతో ఘనత సానందుం డీ పని నేమని యూహించెన్॥ శం॥
ఎండమావులందలి జలముల నొకకుండకు బోయగవచ్చున్
కుండలీంద్రు నొకయెఱ్ఱవిధంబున గొబ్బున మూర్చగవచ్చున్॥ శంక॥
తామరతూడులచే నొకమదకరి దప్పగ గట్టగవచ్చున్
భీమతరంబగు నగ్నికీలనొక పెట్టున మ్రింగగ వచ్చున్।
గాని నారకుల బాధలు మాన్పగ రాని కార్యమెంతయును
పూనికనాకును దేవవిభుడు హరిపొందుపడజేసి నుమంతయునూ॥
సానందుని కీపని దప్పింపగ శక్యము గాదు మునీంద్రా
పూనికతా జేయగ దలచిన పనిపొసగదు విబుధేంద్రా॥

వ॥ అనియీరీతి యముండు పలుకుపలుకులనువిని కలహాభోజనుండు జలజాప్తతనయుం దీవించి చనినపిమ్మట సానందుం డర్కనందను మందిరంబున కేతెంచి యచ్చటచ్చట నారకు ముచ్చటలాలకించుచు వచ్చుచున్న సమయంబున యమ్పురజనంబులు విమానంబున మునిబృందసమేతుండై యున్న సానందునింగని యిట్లని వితర్కించిరి॥

సీ॥ వచ్చెవిమానంబు జెచ్చెరనిచటికి యెవ్వారిదో యేరికెరుగరాదు
యనుచు నందునగలయమ్మౌనిజనమధ్యమున వెల్గుచుండెడి మునిని
జూచి। పురుహూతుడో కాక భూతేశుడో కాక వైకుంఠుడో కాక
వనజభవుడో। వజ్రాయుధంబును వరత్రిశూలంబును చక్రంబు రాజ
హంసమును లేదు। గానమును నారదునుపల్కె కాలుతోడ। వచ్చు
సానందుడిచటికివచ్చునంచు నాతడీతడెయగునని యనుచునుండ వ
చ్చెనటకు విమానంబునిచ్చలలర॥

వ॥ ఇట్లు పురంబు ప్రవేశించు సానందుం జూచి దూతలు ధర్మరాజుతో
దెల్పిన నతం డతని రాకకు వితర్కించుచు నారద వచనంబులు ద
లపోయుచు వేరుపాయంబు దోచమి నాతని ప్రసన్నుంగా జేయ
సమకట్టి.

తో॥ తనరగపూజా ద్రవ్యములెల్లను బారతఁతోఁగొని వేగా
మునికులతిలకు నికర్ఘ్యపాద్యముల ముచ్చటలలరగ నిడగా॥ శం॥

వ॥ మనమున నెంచి యెదురేగి సకల మునివనబృందంబు నడుమ నుం
దారద్రుమంబునలెనున్న సానందుంగాంచి ముకుళితకరకమలుండై.

క॥ శరణుమునీశ్వర త్వత్పద। సరసిజముల కెరగినుతులు సలిపెద ద
యతో। సరగున మీరలు నుత్తురి। కరుదెంచుట శుభము లెస
గ యనఘచరిత్రా॥

గీ॥ పిచ్చుగుంటపైని వచ్చుగంగవితాన। నన్ను ధన్యుజేయ నెన్ని మీర
నాదుపట్టణంబునకు జనుదెంచుట। యేనొనర్చు పాపమెల్లబాసె॥

తో॥ అని నుతియింపగ సంతసమందుచు నతడు సందియము విడచీ
యినసుతుకరమును గరమునబట్టుకు నేనుగువాకిలి గడచీ॥ శంకర॥

కాంచనమణిమయ మంటపమందున గద్దియపై గూర్చుండి
పంచముఖుని శివుశంకరు నుదిలోపలను దలంచుచునుండి॥ శం॥
శమనుని గనుగొని యిష్టాగోష్ఠిని సంతసమందుచునుండా
యముడా మునిపతి గనుగొని పలికెను నతిసంతసమొదవిండా॥ శంక॥

దర్బు ఆది—హిందూస్తాని

మునివరా యిదే వీనిపించూ - పని యేమో యిటు రాంచూ॥
ఘనదయా మన్మూర్తులనించు . మనసిని విని వేడ్క॥ ముని॥
సుబ్బరామయాఖ్య పోష - గొబ్బున దెల్పు మృదుభాషా॥ ము॥

వ॥ అని యిట్లు యముండు నుడివిన బుడుతనెలదాల్పు బత్తుండగు జడ దారి యిట్లని నుడివె. నీపురంబు గన గరంబు మనంబున ముదంబంది ముందు వచ్చితినన యముండిచ్చ హెచ్చిన చింతతో.

ముఖారి—అట.

తీరె మనము పురికినాకు । చేరి మానిర్జ చెరచుట॥ తీరె॥
నారదుండు దెల్పినపుడె । చేరనైతిగా యీశుట॥ తీరె॥
పిలువనట్టి పేరంటముకూ । వెలయ పెద్దగా వచ్చెట॥ తీరె॥
యేమి సేతు యేమనందు । కామవైరి నట గావడా॥ తీరె॥

వ॥ అని యిట్లు మనంబున దుఃఖించి మరియును.

శో॥ సురపతిసంపద వార్ధిపాలుగా చూరబుచ్చెగా నొకడు
చిరశత్రక్రతుండైన నగేశుని చిలువగ జేసెగ నొకడూ॥ శంకర॥
చీకాకొందగ సముద్రజలముల చేరగ్రోలెగద నొకడూ॥

సీ॥ వచ్చెవిమానంబు జెచ్చెరనిచటికి యెవ్వరిదో యేరికరుగరాదు
యనుచు నందునగలయమ్మౌనిజనమధ్యమున వెల్గుచుండెడి మునిని
జూచి। పురుహూతుడో కాక భూతేశుడో కాక వైకుంఠుడో కాక
వనజభవుడో। వజ్రాయుధంబును వరత్రిశూలంబును చక్రంబు రాజ
హంసమును లేదు। గానమునునారదుకుపల్కె కాలుతోడ। వచ్చు
సానందుడిచటికివచ్చునంచు నాతడీతడెయగునని యనుచునుండ వ
చ్చెనటకు విమానంబునిచ్చలలర॥

వ॥ ఇట్లు పురంబు ప్రవేశించు సానందుం జూచి దూతలు ధర్మరాజుతో
దెల్పిన నతం డతని రాకకు వితర్కించుచు నారద వచనంబులు ద
లపోయుచు వేరుపాయంబు దోచమి నాతని ప్రసన్నుంగా జేయ
సమకట్టి.

తో॥ తనరగపూజా ద్రవ్యములెల్లను బారతతోగొని వేగా
మునికులతిలకు నికర్ఘ్యపాద్యముల ముచ్చటలలరగ నిడగా॥ శం॥

వ॥ మనమున నెంచి యెదురేగి సకల ముని వనబృందంబు నడుమ నుం
దారద్రుమంబున లెనున్న సానందుంగాంచి ముకుళితకరకమలుండై.

క॥ శరణుమునీశ్వర త్వత్పద। సరసిజముల కెరగినుతులు సలిపెద ద
యతో। సరగున మీరలు నత్పురి। కరుదెంచుట శుభమునకు తెస
గ యనఘచరిత్రా॥

గీ॥ పిచ్చుగుంటపైని వచ్చుగంగవితాన। నన్ను ధన్యుజేయ నెన్ని మీర
నామపట్టణంబునకు జనుదెంచుట। యేమెనర్చు పాపమెల్లబాసె॥

తో॥ అని నుతియింపగ సంతసమందుచు నతడు సందియము విడచీ
యినసుతుకరమును గరమునబట్టుకు 'నేనుగు వాకిలి గడచీ॥ శంకర॥

కాంచనమణిమయ మంటపమందున గద్దియపై గూర్చుండి
పంచముఖుని శివుశంకరు మదిలోపలను దలంచుచునుండి॥ శం॥
శమనుని గనుగొని యిష్టాగోష్ఠిని సంతసమందుచునుండా
యముడామునిపతి గనుగొని పలికెను నతిసంతసమొదనిండా॥ శంక॥

దర్బ్వా ఆది—హిందూస్తాని

మునివరా యిదే వినిపించూ - పని యేమో యిటగాంచూ॥
ఘనదయా మమ్మేలనించు . మనవిని విని వేడ్క॥ ముని॥
సుబ్బరామాయాఖ్య పోష - గొబ్బునదెల్పు మృదుభాషా॥ ము॥

వ॥ అని యిట్లు యముం డనుడివిన బుడుతనెలదాల్పు బత్తుండగు జడదారి యిట్లని నుడివె. నీపురంబు గన గరంబు మనంబునముదంబంది మూందు వచ్చితినన యముండిచ్చ హెచ్చిన చింతతో.

ముఖారి—అట.

తీరె ఋణము పురికినాకు । చేరి మానినన్ చెరచున్॥ తీరె॥
నారదుండు దెల్పినపుడె । జేరనైతిగా యీశున్॥ తీరె॥
పిలువనట్టి పేరంటముకూ । వెలయ పెద్దగా వచ్చెన్॥ తీరె॥
యేమిసేతు యేమనందు । కామవైరి నన్ గావడా॥ తీరె॥

వ॥ అని యిట్లు మనంబున దుఃఖించి మరియును

శ్లో॥ సురపతిసంపద వార్ధిపాలుగా చూరబుచ్చెగా నొకడు
చిరశతక్రతుండైన నరేశుని చిలువగజేసెగ నొకడూ॥ శంకర॥
చీకాకొందగ సముద్రజలముల చేరగ్రోలెగద నొకడూ॥

ప్రాకటముగను త్రిశంకుతనయు గను బాధ పెట్టెగద నొకడు॥ శం॥
చిత్తజన్మగురుడైన రమాపతి శిరముదన్నగా నొకడూ
కుత్తుకలంటగ గోసెనుగద రాజోత్తము లందరి నొకడూ॥ శంకర॥
కావున వీరల చెల్మిగూడ ఇక గతిదోచదు నాకెట్లూ॥
యీవసుధామరు డేమిసేయునో యెటుల జెపుదు మువ్చట్లు॥ శం॥

వ॥ అని తన మనంబున ఖిన్నత్వంబునొంది సానందుం గనుగొని తమ గురుప్రకారంబుగా మత్పురంబు జూచుండని పలికి కింకరులతో నీ వృత్తాంతంబంతయు మన నగరంబున చాటుండని సెలవొసంగి పనిచె తదనంతరంబ.

ఖరహరప్రియ—ఆదితాళం.

౧ మునివరుతోడుత ముకుళితకాయుడై । చనిపశ్చిమ ద్వారా మునకును యముడనె॥ ముని॥

౨ వీరలు పుడమిని మూరినయ్యసేవ । చేరి చేసిన పుణ్యజనులీ సుగుణులు॥ ముని

3 అనఘా వీరలు ననయము నిజుని । మనమున దలచు భక్త జనులీపుణ్యులు॥ ముని॥

౪ నిరతము బొంకని సరసులు వీరలు । పరమపుణ్యులు శివభక్తులు వీరలు॥ ముని॥

౫ ప్రేమతో గుత్తా సుబ్బరాయ నేలెడి । శ్రీమహేశునిపూజ చేసెటి ధీరులు॥ ముని॥

వ॥ యముండిట్లు సానందఋషిచంద్రునకు ప్రాక్పశ్చిమోత్తర ద్వారంబులం గాంచు పుణ్యపురుషుల చరిత్రంబు దెల్పిన విని విని సంతసించి యిట్లనియె.

క॥ ఏరికి శివపంచాక్షరి ధీరత కర్ణములఁ జొనిపి తేజం బెసఁగఁ
ఘోరమగు పాపమంతయు। దీరునటుల జేతునాది దేవుని కరుణన్॥

గీ॥ అనుచు సానందుఁ డప్పుడు నాత్మలోన। దలఁచి పరమేశు ధ్యానించి నెలయు నరక। వాసులెల్లరు వినఁగను వామదేవు। మంత్రపఠనం బొనర్చె సమ్మాని వరుఁడు॥

కీ॥ మునివరుఁ డిట్టుల మంత్రపఠనమును ముదమున జేసిన మీఁరి
ఘనమగు పాపుల చెవులఁ దూఁకినను కష్టములెల్లను దీరి॥ శంకర॥
కాలుఁడు మనమున చింత నొందఁగను కిడుపడి నారకు లెల్లన్
వాలాయంబుగ రుద్రరూపములు వహియించిరి రంజిల్లన్॥ శంకర॥
భూరిగ తమ తమ దేహకాంతులటు పొంకముగఁ గను వెలుఁగంగా
కోరి విమానారూఢులై గీతము కోరికలను దీరంగా॥ శంకర॥
కైలాసంబున కేగుచునుండఁగ కాలుని సమ్మతిగాంచీ
- ౼ సింపు మ సమ్మతి సంఘము తా దీవించీ॥ శంకర॥
౼ వీరలు పుడమిని నూరిపన్ను ౼ ౼ నములు ౼ డన్
గుణులు॥ ముని

౼ గాడన్॥ శం॥

3 అనఘులీరలు ననయము సిరుని। మనమున దలఁచు భక్త జనులీ పుణ్యులు॥ ముని॥

౼ నిరతము ౼ కని సరసులు వీరలు। పరమ పుణ్యులు శివభక్తులు వీరలు॥ ముని॥

౼ ప్రేమతో గుట్టా సుబ్బారాయ నేతెచ్చి। శ్రీమహేశుని పూజ చేసెటి ధీరులు॥ ముని॥

వ॥ యముండిట్లు సానందఋషిచంద్రునకు ప్రాక్పశ్చిమోత్తర ద్వారంబులం గాంచు పుణ్యపురుషుల చరిత్రంబు దెల్పిన విని విని సంతసించి యుటనియె.